వు శ్రీ వు సత్యనారాయణప్రణీతము.

# రెండుమాటలు.

కవిఒకానొక భావోల్బణములో ఊగిపోయి తన అనుభూతిని తరుచు పద్యంగా ఆలపించడం నైసర్గికం. కథాదిప్రాధాన్యంకలిగిన ప్రబంధాదులకంటె ఏకభావోద్రేకముతో పొరలిన ఖండకావ్యాలు హృదయాన్ని పట్టుకుంటవి.

శతకములు ఈజాతిలోనివి. శతకవాఙ్మయముకూడా మనకు సంస్కృతసారస్వతమునుండి దిగుమతీ అయినదే. అయితే సంస్కృతశతకాలలోవుండే సత్యానుభూతి, ఆవేదన, రచనానైపుణ్యం, తెనుగుశతకాలలో లేదు. ఆర్యాసప్తశతి, శివానందలహరి, సౌందర్యలహరి, మొదలయిన సంస్కృతశతకములకు సరిగా ఏ తెనుగుశతకాలు చూపగలమో తెలియదు. కవికి, తద్వారా కవిత్వానికి ఉండవలసిన అనుభూతి, ఆవేశం, పలుకుబడి, కుదిరీకుదరని లేబరుపుతనము తెలుగువారిలో జాస్తి. కనుక ఏవిధంగానూ తెలుగుసారస్వతము, పరిణతస్థితికిరాలేదు.

తెలుగున యిప్పటికి ప్రకటించిన శతకాలు వేయికిపయిమాట. కానిచెప్పదగినవి, కాళహస్తీశ్వరశతకమువంటివి, ఏవదో ఉంటవి. నీతికి కొన్ని శతకములువ్రాసినారు. చెప్పదగినవి సుమతి, వినురవేమవంటివి రెండు మూడు.

సత్యనారాయణగారి శతకము ఆంధ్రులకు నూతనము గా అందినది. దీని మంచిచెడ్డలు విచక్షణులకు వేర్పరుపనక్కర లేదు. మిత్రుని కవిత మున్ముందు క్రొత్తపోలుపుతో ప్రకటితమై రసికామోదమును బడయుటకు నాఆశీస్సులు.

ఉభయభాషాప్రవీణ,
ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి,
మాడుగుల.

మహారాజశ్రీ పుట్రేవు సత్యనారాయణపంతులుగారు రచియించిన వేంకటేశ్వరశతకము నామూలాగ్రముగా గ్రంథకర్తగారి ముఖమువల్లనే వింటిని. కవిత్వము మిక్కిలి సాఫుగాను రసభూయిష్ఠముగాను, భక్తిరసప్రధానముగాను, ప్రాచీనకవుల కవిత్వమువలె నిరర్గళకవితాధారగాఁ జెప్పబడినట్లున్నది. కాని గణములు పేర్చుకొని తణుముకొని చెప్పినట్లగపడలేదు. చదువరులకు నిజానిజములు గ్రంథమే సాక్ష్యమీయఁగలదు. కాన నేను విస్తరించివ్రాయ నవసరములేదు.

ఇట్లు,
విద్వాన్, వడ్లమాని లక్ష్మీనరసింహశాస్త్రి
సంస్కృతపండితుఁడు
బోర్డుహైస్కూలు,
చోడవరము.

# విజ్ఞాపనము.

ఆంధ్రభాషాభిమానులారా!

ఉ. బమ్మెరపోతరాజకవి వర్యుఁడు ధూర్జటితక్కువారలో
కమ్మనవ్రాసినట్టి శతకమ్ముల నీశతకమ్ము మించఁగా
నెమ్మయినేఁడైన జగదీశుని గ్రంథముగాన మీరు ప్రే
మమ్మున నాదరించి యొకమారు పఠించెదరంచు నమ్మెదన్.

చ. హరిహరభక్త కృష్ణ వసుధాధిపపాలిత మాద్గులాఖ్య స
త్పురివసియించి భక్తులకు మోక్షమొసంగుచునున్న వేంకటే
శ్వరుపయి భక్తితోడుతను వ్రాసితి నీశతకంబు దీసినె
వ్వరయినగాని విన్న చదువన్ సిరిసంపదలబ్బుసమ్ముడీ.

సీ. భోగమందిరద్రిసమఖండసబ్బయ
ప్పలరాజుగారి ప్రపౌత్రుఁడెవఁడు
మిన్నువిఱిగి తనమీఁదఁబడినఁ జలిం
పని సుబ్బరాయుని మనుమఁడెవఁడు
సత్యసంధుండతి శాంతుఁడైనట్టి య
ప్పలరాజవరతనూభవుఁడెవండు
సర్వజనంబులు సాధ్వీమణియటంచుఁ
బలుకుసన్నమముద్దుపట్టియెవఁడు

గీ. అట్టి పుల్లేప్రువంశదుగ్ధాబ్ధిచంద్రుఁ
డైన సత్యనారాయణాహ్వయుఁడ నేను
వ్రాసినట్టి యీ వేంకటేశ్వరశతకము
రవిశశాంకతారకముగఁ గ్రాలుగాత.

శ్రీ

# వేంకటేశ్వర శతకము.

## ప్రారంభము.

ఉ. శ్రీరఘురామచంద్ర! సరసీరుహలోచన! దుష్టశిక్షకా!
సారసగర్భశర్వసురసన్నుత! భూమిసుతామనోహరా!
భూరమణాగ్రగణ్య! మునిపుంగవవందిత! భక్తలోకమం
దార! దయాంతరంగ! నినునమ్మితిఁబ్రోవుము వేంకటేశ్వరా.

ఉ. శ్రీసతిపేరురంబుపయిఁజేర్చి మహాభుజగేంద్రశాయివై
వ్యాసవసిష్ఠకణ్వమునివర్గము భక్తజనంబులెల్ల వి
శ్వాసము తోడనిత్యము స్తవంబొనరింపఁగ నాలకించుని
న్నే సకతంబుఁగొల్తునళినీదళలోచన! వేంకటేశ్వరా.

చ. ధనమునొసంగి కాని వసుధాతలమర్పణఁజేసి కాని పూ
జనెపుడుసల్పి కాని యనిశంబువ్రతంబులొనర్చి కాని నే
నినుఁ బరితృప్తుఁజేయుటకు నేరనుగావున భక్తితోడ నీ
ఘనశతకంబునీయ సమకట్టితినిప్పుడు వేంకటేశ్వరా.

చ. హరిహరులిద్దఱంచు హృదయమ్మున భేదపుబుద్ధిఁగల్గియొం
దఱో వసుధాతలమ్మునఁ గనంబడుచుండిరి నేనుమాత్రమా

కరణిఁదలంచకెంతయు నొకండవునీవెయటంచు నెమ్మదిన్
నిరతమునమ్ముచుంటి రజనీచరశిక్షణ! వేంకటేశ్వరా.

చ. వరరథదంతివాజిభటవర్గము దారతనూజపౌత్త్రసో
దరహితబంధుభృత్యసముదాయము శాశ్వతమంచునమ్మి నీ
చరణసరోజయుగ్మమొకసారియుఁగొల్వని మూఢులుందురీ
నరగణమందుఁగావుననునన్నటుఁజేర్పకు వేంకటేశ్వరా.

ఉ. భానుకులాబ్ధిచంద్ర! భవబంధవిమోచన! దీనరక్షణా!
మానవనాథ! సద్గుణ సమన్విత! రాఘవ! సర్వలోక స
న్మానచరిత్ర! పాతకవినాశక! దానవవంశనాశనా!
నేనినుసన్నుతించుటకు నేరనుగావుము వేంకటేశ్వరా.

చ. వనులనుపర్వతంబులను వార్ధులనాకయునింకదివ్యవా
హినులనుజీవకోట్లనుమహీతలమందుసృజించిపెంచినా
శనమొనరించుచుందువటుసల్పుట నీకువిలాసమేయటం
చని సతతంబుమానసము నందుఁదలంతును వేంకటేశ్వరా.

చ. వనరుహపత్త్రనేత్ర! యదువంశవిభూషణ! పార్థసారథీ!
సనకసనందనాదిమునిసన్నుత! గోపనితంబినీ ప్రియా!
యనిమిషసిద్ధముఖ్యనికరార్చిత! సర్వదిగంతపాలకా!
నినుఁగొనియాడఁజాలుటకు నేరనుగావుము వేంకటేశ్వరా.

చ. అనిమొనదేవదానవులకైన జయింపవశంబుగాని శం
తనసుతసూతపుత్త్రకురునాథకృపాదులు భార్గవుండొకండే
చని సమరంబునన్ గెలువఁజాలుట నీవు దయారసంబుతోఁ
గనుటనుగాదె దైత్యకులకాననపావక! వేంకటేశ్వరా

చ. ఒకరికిఁగీడుఁజేయుటకు నూహయొనర్చిన లేక మేలు వే
రొకరికిఁజేయఁబూనిన మహోత్కటనిశ్చయమె? తానుగాక యం
చకటప్రగల్భముల్ పలుకునంతియె కాని నరుండు కీడు మే
ళ్ళకుఁ బతివీవెయంచని తలంపఁడు నమ్మము వేంకటేశ్వరా

ఉ. మోమునరంగుపూసికొని ముంగురులందముగానుదువ్వియా
కామునికేళిఁగోరు వెలకాంతలనాట్యముఁజూడనందఱున్
భూమినిజేరకుండఁగనుబోదురు నీకదరించుఁబిల్వఁగా
నేమివిచిత్రమో యెఱుఁగ నెవ్వఁడు రాఁడిఁక వేంకటేశ్వరా.

ఉ. బమ్మెరపోతరాజకవివర్యుఁడు భాగవతంబుఁగందిలన్
దొమ్మిదిపద్ధతుల్ గలవు తోయజనేత్రుని జేరువారి సం
ఘమ్మునకించువ్రాసినవి కాంచి ప్రయాసము లేనిభక్తి మా
ర్గమ్మున నిన్నుఁ గూడ సమకట్టితి నమ్మము వేంకటేశ్వరా

ఉ. నీయవతారమంతమున నీవయినుండిన యాగ్రహంబుచే
బోయలమూకనీదు విరిబోణులఁగైకొనిపోన నేమియున్
జేయఁగలేక చూచుచొకచేడి మరీతిఁగిరీటియుంట నీ
సాయములేమిఁగాదె యరిసంఘవినాశక! వేంకటేశ్వరా.

చ. పరతగుణీధనాదులను భావమొకింతయుఁ గోరకుండ నీ
వఱకొనరించి పట్టలిటుపైనటులేసుమితక్పకుండ నీ
కరుణనొనర్తువంచుధృతిఁగల్గినశంబుధరిత్రియందు నేఁ
దిరుగుచునున్న వాఁడవసుదేవకుమారక! వేంకటేశ్వరా.

ఉ. మానవజన్మమున్న మహిమండలినుత్తమమందు విప్రుఁడై
మానుగఁబుట్టి నీస్మరణమాని యకార్యములాచరింపఁగాఁ
బూనివ్రతంబుకాలమునుబుచ్చినఁబాపములున్నయప్పుడే
యానరుఁగాల్పుచోదురితమన్నదియుండునె వేంకటేశ్వరా

ఉ. వచ్చిన దివ్యరాసి సుత బంధుసహోదరమిత్రులన్నఁగా
వచ్చినసర్వలోకపరిపాలనఁజేయ నదృష్టరేఖచే
వచ్చినలెక్కఁజేయకభవత్పదయుగ్మమె భక్తితోడుతన్
నిచ్చలుఁగొల్చువాఁడధరణీసుతవల్లభ! వేంకటేశ్వరా.

ఉ. కామమునుక్రోధలోభములు గర్వము మోహముమత్సరంబునీ
భూమినినాకుశాత్రవులు ముఖ్యముగానిఁక వీనిగెల్వఁగా
నేమియుపాయమీవఱకు నించుకతోఁచుట లేదు నాపయిన్
బ్రేమనుదాల్చి చెప్పుమరవిందదళేక్షణ! వేంకటేశ్వరా

ఉ. శ్రీ ... ...లు ... ...సీముల ... ...ఁజ... మత్స్య భూ
... ...ఁగొల్చి ... రపన్నపాల... నిపుత్త్ర ... ... తోడ ము
న్నాలవ ... ...ఁగొల్చినమహ ...త్మ్ముల... ...పంచకంబు నే
...లనుగాచినాఁడవటులే నను బ్రోవుము వేంకటేశ్వరా

చ. ధనికుఁడు పేదయౌట, వసుధాపతి రాజ్యవిహీనుఁడౌట దు
ర్జనుఁడు, మహేంద్రభోగమనిశంబును బొం[illegible] తెల్లవం
దనమున కర్హులౌటగహనంబులు మేటిపురంబులౌటకున్
గనుఁగొన నీమహత్త్వమది కాదనఁజెల్లునె వేంకటేశ్వరా

ఉ. కాంతులు వోయినట్టి కులకాంతలు నందుఁ గిరాటభామల
శ్రాంతము భూషణంబులభిరామముగా ధరియించి వీధులం
దెంతయు సిగ్గులేక యిపుడేఁగుచునుందురిదేమి కాలమో
వింతగఁదోఁచుచుండెయద వీర! గదాధర! వేంకటేశ్వరా

చ. అనయము నీపదాంబుజములాత్మలనమ్మి సభక్తిసంచయం
బునకటు పైఁ గ్రంథచయమున్ రచియించి ముదంబుతోడ నీ
కునొసఁగు సత్కవీంద్రులకు గూర్మిసగంధుని నన్నుఁ జేయుమం
చననినుగోరువాఁడ ధవళాంబుజలోచన! వేంకటేశ్వరా

చ. భ్రమరము పెక్కుపువ్వుల ప్రాపును జెంది సుఖంబు లేమిచేఁ
గమలము నాశ్రయించు గతి గౌరవనేయులు నాకునున్న లే
శము ఫలితంబు లేక సుమిచయ్యన నీదరిఁ జేరవచ్చితి
సమయమునందుఁగాననను సమ్మతి నేలుము వేంకటేశ్వరా

చ. నలనృగరంతిదేవనరనాథపితానముఁ ద్రోసిపుచ్చి యీ
యిలఁగల మాద్గులాఖ్యపుర మేలిన కృష్ణుఁడు భక్తితోడుతఁ
నిలిపిన నీకు గ్రంథమిది నేనిపుడీయఁగ నట్టిపుణ్యమున్
నలిపితినో యెఱుంగ నదిచయ్యనఁ జెప్పుము వేంకటేశ్వరా

ఉ. దానమునందుఁగర్ణుఁ డలఁదన్ని నకృష్ణుఁడొసంగినట్టి యు
ద్యాన[illegible]మ్ములయందుఫలంబున్నపుండు నేటికిన్
గానఁగరాక క్రిందయధికారులె మెక్కుచునుండ్రికాన భూ
జానిని వేగఁదెచ్చితగుశాస్త్రియొనర్పుము వేంకటేశ్వరా

ఉ. నీకడ లేకయున్న ధరణీపతికృష్ణుఁడొసంగినట్టియా
ప్రాకటనత్పలంబయినఁబొకభయం బణుమాత్రమేనియుఁ
లేకనతంబుఁగ్రిందిజనులే దిగ్రమింగుచునుండఁజక్రమున్
గైకొనిత్రుంపవేమి? దశకంఠవిలుంఠన! వేంకటేశ్వరా

చ. తనదగురాజ్యభాగమును దారనుగోల్పడిగాడ్పుకట్టిఁగై
కొనియలబుష్యమూకమునకున్ జనిభాస్కరసూతిమానసం
బునఁదలపోసినట్టినినుఁబూర్తిగఁజిత్తమునందు సమ్మి యే
సనయముఁదిర్గుచుంటెనుము యంబుజలోచన! వేంకటేశ్వరా

చ. వననిధిలోమునుంగుశతచిపర్వతశృంగమునుండి భూమిమీ
దనుబ[illegible]పుగాతనవితానముహింసను జేయుకాలమం
దనలముఁజొప్పువేళ దివిజారితనూజుఁడుభక్తితోమనం
బునఁదలపోసినట్టినినుఁబూర్తిగనమ్మితి వేంకటేశ్వరా

ఉ. పంకజగర్భ! శక్రసురవందిత! నిర్జరనాథసోదరా!
శంకరచాపఖండన! నిశాచరవంశవినాశనా! హరీ!
పంకజనేత్ర! భక్తజనవత్సల! నందకుమారవర్య! నే
నింకభవత్పదంబులెద నెప్పుడునిల్పెద వేంకటేశ్వరా

చ. కరిపతి వేయివర్షములు గ్రాహముతో జలమందు ఘోరసం
గర మొనరించి తుట్టతుదఁ గాయము వోవునటంచెఱింగి సు
స్థిరమతి నిన్ను గొల్వ నరుదెంచి రయంబునఁ బ్రోచినట్లు న
న్గరుణను గావుమర్థిజనకల్పమహీరుహా! వేంకటేశ్వరా

చ. కులసతులన్ ధనాంగనలఁ గూడెడివారలతోడఁ బెక్కుచి
క్కులు సుజనాళి కెప్డు సమకూర్చెడివారలతోడ భ్రూణహ
త్యలనొనరించువారి సముదాయముతో శమరెన్నొ క్రౌర్యముల్
సలిపెడివారితోడ ననుసాటియొనర్పకు వేంకటేశ్వరా

చ. నినుబగచేత దుష్టరజనీచరవీరులు భీతిచేతఁ గం
సనృపుఁడు బాంధవంబున నసత్యకదూతలు పొందవేయులుంగ
ఘనమగు భక్తిచేత నరకాంతులనేకులు సేరిరందు భ
క్తి నిసుమిఁ గొల్చి చేరెద సుధీజనవందిత! వేంకటేశ్వరా

చ. తనయుఁడు సేయు తప్పులను దండ్రిగణింపక ప్రోచురీతి నే
ననిశము సల్పుదోసముల నాత్మదలంపక కాచి నాకిల
జ్జనము గల్గకుండగ నొనర్పుము నీచరణాబ్జయుగ్మమే
మనమున నమ్మినాఁడ బలమర్దనసోదర! వేంకటేశ్వరా

చ. నిరతము రాత్రిభాగమున నీరజమిత్రుఁడు క్రుంకులోవలన్
జరణయుగంబు క్రిందఁబడి చచ్చుచునున్న విపుర్వులెన్నొ యా
దురితము సెందకుండఁ గడుదూర మొనర్పుమటంచు భక్తితో
దలచుచుఁ గోరువాఁడ వరదా! పరమేశ్వర! వేంకటేశ్వరా

చ. క్రతువుల నెన్ని చేసినను కానలకేఁగి తపంబొనర్చినన్
వ్రతములనేకముల్ సలిపినన్ బహుతృప్తులఁ జేయనిన్నుఁ గ
ష్టతమమటంచు లోనెఱిఁగి చాల ప్రయాసము లేనిభక్తి ప
ద్ధతి నిపుడేను పూనితి సుదారగుణాన్విత! వేంకటేశ్వరా

చ. గురుసుతభీష్మకర్ణకృపకుంభజముఖ్యసహాయసంపదన్
గురుపతికిన్ సుఖంబు సమకూరుట లేదని యాలకించి యీ
నరులసహాయ మేనిఁక మనంబునఁ గోరుటమాని నిన్ను సు
స్థిరముగ నమ్మినాఁడనను జేకొని కావుము వేంకటేశ్వరా

చ. అలజమదగ్నికిన్ సుతుఁడవై జనియించి సమస్త ధారుణీ
తలపతులన్ వధించి వసుధాస్థలిఁ గశ్యపమౌనికిన్ జనం
బులు సురలెల్ల మెచ్చుకొనఁ బూర్తిగ దానమొసంగినట్టి నిన్
దలఁచెదఁ జిత్తమందు సంతతంబిఁక నమ్ముము వేంకటేశ్వరా

ఉ. గోపనితంబినీమణులు గూడి యశోదకు నెన్నొ నేరముల్
నీపయిఁ జెప్ప నామె విని నెమ్మది బుత్త్రుఁడంచు నెంచి ని
న్నాపయిఁ గట్టెఁగా నిపరమాత్ముఁడటంచు నెఱింగియున్న చో
నాపనిఁ జేయునొక్కొ? వనజాసనవందిత! వేంకటేశ్వరా

చ. అనలము మ్రింగి గోపనిచయంబును గాచుట కాళియాహిపైఁ
జని మునినాట్యమెంతయును సప్పటశైలము నాతపత్రమో
యనుకొనునట్టులెత్తుట ప్రయత్నముఁ జేసినఁ జేయశక్యమే
జనులకు నీకె శాకహరచాపవిఖండన! వేంకటేశ్వరా

చ. పురుషుని నొక్కచోటఁ బువుఁబోడిని వేఱొకచోట సృజించి యా
యిరువుర నాపరాని గతి పెట్టి యెప్పటినుండియొ యున్నయట్లు నో
పరులకుఁ జూపి మోహమున వారల ముంచి చరించుచుందు వీ
వరయఁగ నీ మహత్త్వముఁ గొనియాడ నశక్యము వేంకటేశ్వరా

ఉ. పిల్లనఁగ్రోలితో నెమలిపింఛముతోఁ జిరునవ్వుమోముతో
నల్లని మేనితో విహగనాథునితోఁ గమలాలతాంగితోఁ
జల్లనిదృష్టితో దనొకసారి రయంబున వచ్చి బ్రోవు మీ
వల్లవకామినీహృదయవారిజబంభర! వేంకటేశ్వరా

చ. శరభమృగాధినాథమదసామజగండకపుండరీక సూ
కర చమరీ లులాయ కపి కాయము వాస మొనర్చు కాసకే
నరిగి తపంబుఁ జేయుట ప్రయాసముగా వృథ భక్తితోఁ బవిత్ర
నిరతముఁ గొల్వ వాఁడు నళినీదళలోచన! వేంకటేశ్వరా

చ. ధనయుతుఁడైనవాఁడు తన ద్రవ్యము వేశ్యలకీయఁబూనుటో
ఘనముగు వర్తకంబునకు ఖర్చును బెట్టక దాచియుంచుటో
కనుగొనఁ జేయుఁగాని యొకకాసును నీకిడఁడేమి హేతువో
వినియెదఁ దెల్పుమా దనుజవీరభయంకర! వేంకటేశ్వరా

చ. అరరె మృగంబు జాలకమునందుఁ దగుల్కొనినట్టు లేను సో
దర సుత పుత్ర బాంధవ వితానము మధ్యను జిక్కిపోయినన్
స్మరణ నొనర్చి చేరుటకు మార్గమెఱుంగక యుంటిఁ గాన స
త్వరముగఁ జెప్పుమయ్య యదువంశవిభూషణ! వేంకటేశ్వరా

ఉ. నినుమదినమ్మినట్టి మునిపాళియు నెందరి వెంటనంటి యే
యనిశము సంచరించియొక హానిపదైనను గల్గకుండఁగాఁ
గనుగొనుచుందువా సరణిఁ గానియెడన్ బ్రముకంగవారి కు
ర్వినివశమౌ తలంపసరి వీరభయంకర! వేంకటేశ్వరా

చ. ఖలులగు కౌరవుల్ ద్రుపదకన్యను దత్సభకీడ్చి తెచ్చి చీ
రలఁ దివియంగ నామె తనురక్షణఁ జేసెడువారు లేమిఁ జే
తులఁ బుడమోడ్చి ప్రోవుమని దుఃఖముతో నినుఁగొల్వఁ గోకలన్
గలుగఁగఁ జేసి మానమును గావవె? చెప్పుము వేంకటేశ్వరా

ఉ. పాండునరేంద్రపుత్త్రికులు భావమునన్ నిను నమ్మియుంట చే
భండనమందు నిల్చి సుభంబుగ వైరుల నెల్లఁ గూల్చి భూ
మండలమంతఁ గైకొని సమస్తసుఖంబులుఁ బొందిరట్లు కా
కుండిన వెంటనే పొలియకుందురె చెప్పుము వేంకటేశ్వరా

చ. తనయసగంధబంధుజనదారసహోదరవర్గసంఘమున్
ఘనముగు పాడిపంటలును గంధగజేంద్రతురంగసద్భటా
ళినివిడనాడి పేదరికతలే నిరతంబుఁ బఠించుచుంటిఁగా
వున దయదాల్చి కావుమిఁక భూరిగుణాకర! వేంకటేశ్వరా

చ. అరువదినాల్గువిద్యలు ప్రయాసము చేఁదగ నేర్చియాపయిన్
సరసకవిత్వమల్లుటకు శక్తినిఁ గల్గి భవత్కథాళిఁగా
విరచనఁ జేయుచుంటి నెడ వేఁడుగ నానరజన్మమిచ్చుటల్
బరమునవ్యర్థమంచుఁ దెలుపన్ వలెనా? యిఁక వేంకటేశ్వరా

చ. కలుషములెన్నొనల్పుచును గాలము బుచ్చెడి పుత్రు నేనియుం
దలఁదునమాడిలి రెదవు ధార్మికుఁడై బహుయోగ్యుఁడై యఘం
బులదెసఁ బోక తిగ్గుటకుఁ బూనిన హీనకులీనుఁడైన నే
సిలుగులు సొందకుండ దయ చేఁగనుచుందువు వేంకటేశ్వరా

చ. మునులను భక్తులన్ జిగురుబోండ్లను శక్తినశారి నెల్ల బా
ధను సతతంబుఁ బెట్టుచు సధర్మమునన్ జరియించుచున్న నీ
తనయుని నైన ద్రుంతువను దానికి సాక్ష్యము ధారుణీతనూ
జుని చరితంబు గాదె మధుసూదన! శ్రీధర! వేంకటేశ్వరా

ఉ. హీనకులంబునందు జనియించియు యోగ్యుఁడుగాక యున్న చో
నానరుఁ గాచువాఁడవని యంటిని కాన కబీరుదాసుపై
భూనుతిఁ గన్న సత్కవులు పూర్వము సెప్పిన యాచరిత్రమే
నేనిట సాక్ష్యమిత్తుసుమి నీరజలోచన! వేంకటేశ్వరా

చ. అనఘుఁడు క్రీడి బాంధవుల నన్నలఁ దండ్రులఁ యుద్ధభూమిలోఁ
గనుగొని వారి నెల్ల నరకం గమకింపఁగఁ జేతులాడవం
చని వచియింప నాతనికి నప్పుడు గీతను జెప్పి చంపఁజే
సిన నినుఁ గొల్చువాఁడ సరసీరుహలోచన! వేంకటేశ్వరా

చ. సనకసనందనాదిమునిచంద్రులు సిద్ధనిలింపసాధ్యులుం
నినుఁ గొనియాడఁ జాలుటకు నేరరటంచని గ్రంథసంఘము
ల్లను దెలుపంగ నాకెటులు తెలంబగు నీ స్తుతి సేయంగాను గా
వున దయదాల్చి కావుమిఁక భూరిగుణాకర! వేంకటేశ్వరా

ఉ. భారతయుద్ధకాలమునఁ బార్థునికై విడనాడియేరినో
సారథిగాఁ గ్రైకొనిన సద్గురుకర్ణులు గుప్పినట్టి యా
ఘోరశరంబులన్నియును గూడి శతాంగముతోడ నాతనిన్
గౌరవనాథుఁ డుల్లసిలఁ గాల్పవె చెప్పుము వేంకటేశ్వరా

చ. కనకపుఁ జాయమించు గలకాయముచేత వెలింగి నిండు జ
న్వనమునఁ గ్రాలు కామినుల పైనుపయోగముఁ జేయఁబూనగా
ననిశముఁ గాస్త్రములు కలిగెనంచును నిన్నుఁ గఁబూజఁ జేయఁగా
దనుచును బలుకారమితమైరివిజంబిది వేఁకటేశ్వరా

చ. జనకుని నమ్ము పుత్త్రికుని చాడ్పున, గోవును నమ్ము క్రేపురీ
తి నిజలజమ్ము నమ్మి కొను తేటి విధంబున నిన్ను మానసం
బున సతతంబు నమ్మి తలపోయుచునుంటిని కాన వేగము
క్తి నిదయ చేయుమయ్య వసుదేవకుమారక! వేంకటేశ్వరా

చ. మనుజుఁడు తక్కువేళలను మానిన వేడ్కను బుచ్చునప్పుడై
నను నిశనొ సారియయినన్ స్మరించి సముక్తి వాని క
ష్ట్బునఁ గవింపనట్టియినఁ బూర్తిగ నీ దయయొగ్గమున్ సతం
బును దలపోయు భక్తులది పొందరె చెప్పుము వేంకటేశ్వరా

చ. మురనరకాదిదానవ సమూహములన్ సమరంబునన్ దివం
బరయుట కంపి లోకులకు నాపదలంతముఁ జేసి నిత్యమున్
గరుణను బ్రోచినట్టి ఘనుగాఢముగా మనమందు నమ్మి యేఁ
దిరుగుచునున్నవాఁడ వసుదేవకుమారక! వేంకటేశ్వరా

చ. నరపతిసంఘముల్ రిపుజనంబులుసూడఁగ ద్రౌపదీస్వయం
వరమున యంత్రమత్స్యమును వర్వతపైఁ తనూజుఁడప్పు నీ
కరుణనుగాదె కొట్టి సతిఁ గైకొనఁజాలెను లేకయున్న చో
దరమొకొ? వానికిఁ గొనఁగ దైత్యవినాశక! వేంకటేశ్వరా

ఉ. రంగదరాతిభంగ! ఖగరాజతురంగ! యటంచుఁదొల్లి ఖ
ట్వాంగనృపుండు ప్రాణములువాసెడివేళ (విలంబ)ముక్తిఁ జెం
దంగ నిరంతరంబు నెధ్యానము సేసెడి భక్తులెల్లఁ బొం
దంగవిచిత్రమేమి విబుధప్రకరార్చిత! వేంకటేశ్వరా

ఉ. పన్నగశాయి దీనజనబాంధవ! గోపనితంబినీప్రియా!
సన్నుతకీర్తిశోభిత! నిశాచరనాశక! యంచు నెప్పుడున్
మన్ననఁజేసికొల్చుజనమండలికెల్ల నమస్కరింతునా
పన్నశరణ్య! దేవగణవల్లభవందిత! వేంకటేశ్వరా

చ. జనకునియింటనున్న హరచాపము భగ్నముఁజేయనేఁగుచోఁ
గని యలగౌతమాశ్రమము గక్కనఁజొచ్చి చలించియొక్కచో
టనుబడియున్న ఱాతినిఁ దటాలున ద్రొక్కి వధూలలామఁ జే
సినభవదంఘ్రిఁ గొల్తు సరసీరుహలోచన! వేంకటేశ్వరా

ఉ. నీకు సమస్తజీవులు వనీస్థలియందు సమానమట్లుగాఁ
గాకమహోక్కటీరయిన గండశిలన్ వసియించునట్టి యా
భేకముజీవితంబుగడు వేడుకతోడుత నింతదాక తా
నేకరణిన్ భరించునిఁక మృత్యువునొందక వేంకటేశ్వరా

ఉ. కొందఱుబీదలౌటమఱి కొందఱువైభవశీలురౌటయుఁ
గొందఱుమూర్ఖులౌటయునుగొందఱుసత్కవినాథులౌటవా
రందఱిపూర్వకర్మఫలితార్థముగాక తలంపగాను నీ
యందొకతప్పిదంబుఁగలదా కమలోదర! వేంకటేశ్వరా

ఉ. నమ్మనుతీర్థయాత్రలను నమ్మనుధ్యానములన్బురాణముల్
నమ్మనుయజ్ఞసంచయము నమ్మనుముఖ్యముగా మనంబులో
నమ్మితినయ్య నీదుచరణంబులనారత మేను గాన శీ
ఘ్రమ్మనవచ్చిప్రోవుమనఘా! వనజోదర! వేంకటేశ్వరా

చ. తనులమితంబుగాఁగలిగి పట్టవల్ నినునింకమానసం
బునఁ దలపోయలేనిజనముల్ మఱికార్యములెవ్వి లేక భో
జనమును నిద్రమాత్రమునుసంగతిఁగల్గినరాత్రియైనఁ జిం
తనమొనరింపకుండని కతంబెఱిఁగింపుము వేంకటేశ్వరా

చ. జనకునియింటనున్నహరచాపముభగ్నముఁజేయ భూపతుల్
చని విఫలంబునొందిరనుసంగతినంతయు నాలకించి చ
య్యనసటకేఁగిదానినిఁబ్రియాసముఁబొందక త్రుంచివైచి సీ
తనుగొనిహావుకావె వరదా జగదీశ్వర! వేంకటేశ్వరా

చ. మరణమునొందువేళనిను మానుకమానసవీధిభక్తితో
స్మరణనొనర్పఁబూనుటకు శక్తుఁడనౌదునొకానొకక్షమే
నెఱుఁగనుగాననాటికిపుడే తలపోసెదనమ్మియింక నో
శరనిధికన్యకాహృదయ సారసబంభర! వేంకటేశ్వరా

ఉ. ఈయవనిస్థలిం గతము నిప్పటిసంగతినింక యెట్టొరాఁ
బోయెడిదానిఁ జెప్పఁగల మానిజనంబులకైనఁగాని నీ
మాయ నెఱుంగ రాదనుచు మాదగు గ్రంథములెల్లఁ దెల్ప నే
చాయను నేనికన్ దెలియఁజాలుదుఁ జెప్పుము వేంకటేశ్వరా

చ. అనిమిషసిద్ధయక్షఖచరాదుల భండనరంగమందు గె
ల్చి తరువాత వారివనసీమను భాసిలు పారిజాతమున్
గనుగొని దాసిభూస్థలికి గ్రక్కునఁ గైకొనివచ్చి సత్యకి
చ్చిననిను నావశంబె నుతిఁ జేయ, రమావర వేంకటేశ్వరా

చ. వనరుహమిత్రపుత్రికునివల్ల ఘటోత్కచుఁడాలమందుఁ జ
చ్చినతటి నేడ్చు పాండవులఁ దేల్ప విరాజిలినట్టి నీముఖం
బును గనవాంఛ చిత్తమునఁ బుట్టెను గావున నొక్కసారి చ
య్యనఁ జనుదెంచి చూపుము సురారివినాశక వేంకటేశ్వరా

ఉ. కాచితివీవు గోపకనికాయము పాండునృపాలపుత్రులన్
గాచితి వంబరీషనరకాంతునిఁ గాచితి వాకుచేలునిన్
గాచితి వింక నెందఱినొ కాచితి వింతకుఁ దొల్లి నేఁడు నన్
గాచుట భారమా నరసఖా వచియింపుము వేంకటేశ్వరా

చ. శరనిధి దాటి లంకను నిశాసమయంబునఁ జొచ్చి జానకీ
తరుణినిఁ జూచి రాక్షసకదంబమునంతముఁ జేసి దానవే
శ్వరుఁగని తిట్టి మీదటను వాయుతనూభవుఁ డప్డు తిర్గి నీ
కరుణను గాదె రాఁగలిగె కంజదళేక్షణ వేంకటేశ్వరా

చ. నినుభగవంతుఁడంచెఱిఁగి నెమ్మనమందరుదెంచి చేరకుం
డినయెడ నావిభీషణుఁడు నిక్కముగాఁ దనవారితోడనా
యనిమొనఁగూలకుండధరయందున జీవముతోడనుండు నం
చనియెవఁడైనఁజెప్పఁగలఁడా పరమేశ్వరా వేంకటేశ్వరా

చ. వనరుహగర్భుతోడ నెనవచ్చెడి కౌశికమౌనితో వనం
బునఁజరియించిముందు జమ్ముఁబ్రోలికిఁదాటకినంపి యామెనం
దనుఁదరువాతఁగూల్చి యలతాపసవర్యులఁబ్రోచినట్టి ని
న్ననిశమునమ్మినాఁడ ధవళాంబుజలోచన వేంకటేశ్వరా

చ. అనిమిషవాహినీతనయుఁ డాహవమంతయుఁజేసి యంపశ
య్యనుబడియుండి మేనువిడనాడెడివేళను భక్తితోడ నా
త్మనుదలపోసినట్టినినుఁదప్పకనమ్మి భజించుచుంటిఁగా
వుననను(బ్రేమతోడుతనుబ్రోవఁదలంపుము వేంకటేశ్వరా

చ. అరయఁగనీకథన్వినుటకైచనరే చనిరొక్కవేళఁ దా
మరిగినఁజెప్పువానికరమందొకకానియుఁబెట్టకుండ మం
దిరములకేఁగుచున్దిరిగి నిన్నుఁగనాతనినిందఁజేయుచుం
డిరిజనులెందఱోయిపుడు నీరజలోచన వేంకటేశ్వరా

చ. తనరిపులైనకౌరవవితానమునంతముఁజేయనెంచి ఫ
ల్గునుఁడిఁక నీసహాయమునుగోరఁగసమ్మతమందివచ్చి యా
తనిరథచోదకుండవయి ధాత్రికిభారముఁబాపినట్టి ని
న్ననిశముఁగొల్చువాఁడనమరాధిపవందిత వేంకటేశ్వరా

ఉ. కాంతలబల్మిఁబట్టి సురకాంతునిఁదక్కినవారినెల్ల న
క్రాంతము బాధబెట్టిన నిశాచరసంతతి నాలముందు వా
యంతకుపాటికంపిన మహాత్మునినిన్ గడుభక్తితోడ నే
స్వాంతమునన్ దలంతు దివిజాధిపవందిత వేంకటేశ్వరా

చ. అనిమిషవాహినీతనయుఁ డావిదురుండు గురుండు పెక్కు స
న్మునివరులీవు పాండునృపపుత్రులకున్ సగపాలునీయుమం
చనఁగ సుయోధనుం డొసఁగ కంతయుఁ బొందినరీతిఁ బెద్దవా
రినిఁగణుతింపనట్టి ఖలబృందమడంగదె వేంకటేశ్వరా

ఉ. నీదగు సేవఁజేసి రజనీచరవంశజుఁడైనయట్టి ప్ర
హ్లాదుఁడు నంబరీషుఁడు మహామహుఁడౌ ధ్రువుఁడింక నెందఱో
మోదముతోడ ముక్తి, మునుపొందుట నేవిని దానికిప్డు నీ
పాదసరోజయుగ్మమును బట్టితి నమ్మము వేంకటేశ్వరా

చ. ఘనుఁడు కిరీటి సైంధవునిఁ గయ్యమునన్ రవి గ్రుంకకుండఁ ద్రుం
తునని సమస్తదేశనృపతుల్ వినుమాడఁ బ్రతిజ్ఞఁ జేసి దా
నినిఁ బరిపూర్తిఁ జేయుటకు నెమ్మనమందుఁ దలంచినట్టి ని
న్ననిశము నమ్మియుంటి వనజాసనవందిత వేంకటేశ్వరా

చ. దినములు బాగు లేనితఱిఁ దిగ్గి మహాత్ముల నెంతయాశ్రయిం
చిన నొక కార్యమైన ఫలసిద్ధిఁ బొందదు ద్రవ్యమూడి పో
వును తను పెక్కుడౌ శ్రమను బొందును భూస్థలి నెంతవారికై
ననుచుఁ బల్కువాఁడ సుజనప్రకరార్చిత వేంకటేశ్వరా

చ. ఖలుఁడనుచు యోధవాఖ్యుఁడతిగొంవనేయఁ బొంచురాజపు
త్త్రిలనేకలక్ష యింటనుగుఱ్ఱాల మొప్పగనుంచిదానికిన్
జలమునవహ్నిఁ బెట్టఁగను జావక పోవుట వారలెల్ల నీ
బలముసఁగాదె భక్తజనవత్సల శ్రీధర వేంకటేశ్వరా

చ. ఘనుఁడగుకృష్ణరాయమహికాంతునివంటినృపాలుడింత దా
కను లభియింపకుండుటనుగాదె మహామహుఁడైనపెద్ద నా
ర్యునకెనవచ్చుసత్కవివరుల్ వె[illegible]గొందగ నేరకుండ్రి యా
యినరహితాబ్జముల్ క్రియమహీసుతనాయక వేంకటేశ్వరా

చ పెనిమిటివృద్ధుఁడంచునవివేకుఁడటంచుఁ గురూపియంచుఁగా
ఘునిసమరంబునన్ నిలువఁబూనఁగఁజాలఁడటంచునెంచియా
తనివిడనాడిపోవువనితామణి యీజము వీటియందు బా
ధనుబడకుండదాటఁగలదా వచియింపుము వేంకటేశ్వరా

చ. పెనిమిటివృద్ధుఁడంచునవివేకుఁడటంచుఁ గురూపియంచునా
తనిసిరసింపకుండ సతతంబు చుగౌరవమెంతొ చేసి సే
వనుమతిసల్పుచున్ గడుపుభామినియిచ్చటఁగీర్తిఁ గాంచియా
యనిమిషలోకమందుసుఖమొందదె చెప్పుము వేంకటేశ్వరా

చ. మదయుతులైనయట్టిప్రభుమండలిసన్నిధిఁ జేరి మానవుల్
పదవులొసంగుఁడీయనుచుఁ బ్రార్థనజేసెదరంతెకాని నీ
ముదమునఁదాముముక్తిపదమున్ సమకూర్పుమటంచుసంతతం
బెదఁదలపోయరాదెజగదీశ పరాత్పర వేంకటేశ్వరా

కులములరీతినుండఁగనుఁగొంచు నుపేక్షరొనర్పఁబాడియా
తెలుపుము నాకు వసుదేవకుమారక! వేంకటేశ్వరా

చ. జనములు బాగుగాను దివసంబులు సాగుచునున్న నీతలం
పును విడనాడి గర్వమునఁ బుద్ధి పదంపడి యవ్విమారిపో
యినఁ గడుభక్తిఁ గొల్వనపు డేమియుఁ గోవముఁ జెందకుండ బే
మనుగని ప్రోచునిన్ను వశమా నుతిఁ జేయఁగ వేంకటేశ్వరా

చ. అరయఁగ దాతలం దధికుఁడై సురయక్షభుజంగసిద్ధకిం
పురుషుల గెల్చి భూవలయముల్ బరిపాలన జేసి జన్నముల్
జరిపి యశంబు దిక్కులకుఁ జాటినయాబలి ద్రొక్కినట్టి నీ
చరణమె నమ్మియుంటి సుమి సామజరక్షక! వేంకటేశ్వరా

చ. ధరణితలంబునందు నన్నృతంబునధర్మము ద్రోహబుద్ధియున్
బరవనితాభిలాషయును ప్రాజ్ఞులనందఱ నిందఁ జేయుటల్
నిరతమునమ్మి నట్టి మహనీయుల మోసమొనర్చి నవ్వుటల్
నరులకు నెక్కుడయ్యె యదునందన! శ్రీవర! వేంకటేశ్వరా

చ. జనుఁడు శరీర మెన్నటికి శాశ్వతమన్నది కాదటంచు నె
మ్మనమునఁ దానెఱింగియుఁ గుమారులబంధులఁ దక్కువారిజీ
వనములకింక కాలమును వ్యర్థమొనర్చుచునుండుఁగాని యొ
క్కనిమునమైన నిన్ గొలువఁగాఁదలపోయఁడు వేంకటేశ్వరా

ఉ. అక్కసుమాయుధుల్ గెలుచు నాతనికందవికారమానసిన్
చక్కని చిన్నదానికి రసజ్ఞత లేక చరించుపూరుషున్
నిక్కముగానొసంగియువనీస్థలి నీగతిమాయఁ జేయఁగా
నక్కట హేతువుల్ దెలుపుమా ఖగగోరద వేంకటేశ్వరా

ఉ. శంతనసూతితీవ్రశరజాలములన్ బరగించి నిన్ను నా
కుంతికుమారుఁడైనకునిఁగొట్టఁగ బాధసహింపలేక ఖం
డింతునటంచుఁ బల్కుచు వడిన్ జనివచ్చిననీకురూపమున్
స్వాంతమునఁ జూడఁగోరె దివిజాధిపవందిత! వేంకటేశ్వరా

చ. తనకుఁ బరాభవంబుఁ బినతల్లి యొనర్చెనటంచు నాగ్రహం
బున ధ్రువుఁ డొంటిగా విపినభూమికి వేచని భక్తియుక్తుఁడై
నినుఁ గొలువంగ నాతనికి నీదగురూపముఁ జూపి యెవ్వరో
రిననవి యీయలేదెనును వృష్ణికులాధిప! వేంకటేశ్వరా

చ. అళియిడనాడి యన్యకుసుమాళి సరోజముఁ జేరురీతి నేఁ
గులతరుణీసుపుత్రహితకోటినిఁ దక్కనవానిడించి ని
శ్చలమగుభక్తితోడుతను సత్వరమే నినునాశ్రయించితి
న్గలుగును సౌఖ్యమంచెదను నమ్మి సురాత్పర! వేంకటేశ్వరా

చ. ఘనుఁడగు భీమసేనుఁడును గౌరవరాజధరిత్రిలోనమై
యుని నొసరించువేళ ననలాత్మజుఁ డాతనిఁ గూల్చునీము ఖం
బుచుగనికీలుసెక్కితనుఁ బోవ్రుమసంగను నీవు లెక్కఁజే
యునిమెడ నాతఁడేనుగునో యందఱెఱుంగరె వేంకటేశ్వరా

ఉ. వన్నెలుచిన్నెలున్ గలుగు భామలపైనె మహానుభావుఁడై
యున్ననరుండు గూడఁ దనయుల్లము నెప్పుడు ద్రిప్పుచుండు నీ
వన్ననదే మొత్రిప్పుకేఁ నాగ్రహమొంతయు నొందుచుండ ని
ట్లున్నదికాలమెల్ల భువనోద్భవకారణ వేంకటేశ్వరా

ఉ. నీవు సృజించినట్టి రమణీమణులన్ నరులన్ మృగాదులన్
బూవుల ఘోరశైలచయమున్ దరులన్ నదులన్ వనంబుల

భావనసైనవార్థులను బాగుగఁ గాంచుచుటకాక వర్ణనల్
నావశమా నెచే సఁగను నందకుమారక వేంకటేశ్వరా

చ. తలఁపఁగనిర్ఝరోదకము ప్రాఁగుటకున్ భుజియింపసత్ఫలం
బులు వసియింపశైలబిలముల్ ధరియింపఁగ నారచీర లీ
యిలనులభించియుండఁబరితృప్తి నిబొందక తుచ్ఛభూపులన్
గొలిచెడివారి నేమనినఁగూడదె చెప్పుము వేంకటేశ్వరా

చ. కరములశంఖచక్రములు కర్ణయుగంబునఁగుండలంబులున్
శిరమునఁబింఛముల్ గనులశీతమయూఖదినేశులింక పే
రురమున దుగ్ధవార్ధిసుతయున్ గళసీమనుమాలఁగల్గి నీ
దరిసెనమీయుమయ్య వరదా! మురళీధర! వేంకటేశ్వరా

ఉ. వందనమాచరింతు ఖగవాహన! రాక్షసలోకనాశనా!
నందకుమార! శేషశయనా! కరిరాజవిపక్షశిక్షణా!
సుందరదేవా! కృష్ణ! మధుసూదన! పద్మదళాయతాక్ష! గో
వింద! రమేశ! రూపమును వేగమె చూపుము వేంకటేశ్వరా

గద్య. ఇది శ్రీమత్కౌశ్యపసగోత్రపుత్రేపువంశోద్భవసుబ్బరాయా
మాత్యపౌత్ర అప్పారాజతనూభవ శ్రీవేంకటేశ్వర
చరణారవిందధ్యాన పరాయణ సత్యనారాయ
ణాభిధాన ప్రధానమణి ప్రణీతంబైన
వేంకటేశ్వరశతకము సంపూర్ణము.

శ్రీవేంకటేశ్వరార్పణమస్తు.